మార్గములను బోధించుచున్నట్లు తెలుపు చిత్రము కలదు. రెండవది బుద్ధునియవతారకథ—బుద్ధుడు వెల్లయేనుగరూపమున తుషితస్వర్గము నుండి దిగివచ్చినట్లు బౌద్ధులు చెప్పెదరు. మనకిందుగాన్పించు వెల్లయేనుగు బుద్ధుడే—భూలోకమున జన్మింప నవతరించుచున్నాడు. ఆ శ్వేతగజమును కుబ్జగణములు మోయుచున్నారు. దేవగంధర్వులు పరివేష్టించి వచ్చుచున్నారు. ప్రభులాంఛనములైన వేత్రవంశచ్ఛత్రములను పట్టుకొని కొందఱు ఆ వెల్లయేనుగుముందు నడుచుచున్నారు. దివ్యనృత్తగీత వాద్యములు చెలరేగుచున్నవి. కొందఱు ఆడుచున్నారు. కొందఱు అభినయించుచు పాడుచున్నారు. మఱికొందఱు జంత్రవాద్యములు వాయించుచున్నారు. జగద్వ్యాధినివారణ కార్యమునకై బుద్ధుడవతరించుచున్నాడని అంతయు నానందమే. మూడవవిభాగమున మాయాదేవి స్వప్నవృత్తాంతము తెల్పబడినది. శుద్ధోదనుని పట్టపుమహిషియైన మాయామహాదేవి చక్కనిశయ్యపై బరుండి నిద్రించుచున్నది ఆ మెతల్పము నాలుగుమూలల చతుర్దిశలను పాలించు దిక్పాలకులు నిలుచుండియున్నారు. పర్యంకమున కిటునటు ఆమె పరిజనము కొందఱు కూర్చుండియున్నారు; కొందఱు నిలుచుండియున్నారు. పర్యంకమున కెదురుగానున్నవారిలో నిద్దఱు రామెకు వీవోపు లిడుచున్నారు. స్వర్గమునుండి యొకవెల్లయేనుగు వచ్చి తనగర్భమున ప్రవేశించుచున్నట్లు ఆమె కలగాంచుచున్నది. మాయామహాదేవి స్వప్నము, బుద్ధునిజన్మము—వీటికి సంబంధించిన చిత్రములు అమరావతీస్తూపమున పెక్కుచోట్ల గలవు.

మూడవ చిత్రమున గనబడునవి ప్రాకార రేఖలోని అడ్డదూలములమీది వృత్తచిత్రములు. వేఱువేఱు విధములైన కల్పనలతో ఇందు "త్రిశూల" చిహ్నము చిత్రితమైనది. ఈ త్రిశూలము సాధారణముగ జ్వాలాస్తంభమునకు మకుటముగ నుండును. త్రిశూలాధిష్ఠితమైన యీ స్తంభము సాధారణముగ నొక సింహాసనము వెనుక నుండును. ఈ స్తంభమునకు కుడియెడమవైపుల ఊర్ధ్వగతిని జ్వాలలు ప్రసరించుచున్నట్లు చూపుదురు. ఈ జ్వాలాస్తంభములు ఒక్క యమరావతిలో తక్క ఉత్తరహిందూస్థానమునందలి స్తూపములలో నెచ్చటను గానరావు. అంతేకాక బౌద్ధకళ ప్రారంభకాలమున గూడ వీటి "అడా పొడా" ఎచ్చటను గానరాదు. అదివరకున్న చిత్రమైన బౌద్ధసంజ్ఞావళి(Symbols)కి అమరావతి ప్రత్యేకముగ కనిపెట్టి యొసంగిన విచిత్రోపాయన మీ జ్వాలాస్తంభము. ఈ వృత్తమునందలి కుడివైపు ఎడమభాగము పాడగుటవలన అచ్చటనుండిన చిత్రవిశేషమ్ము లేవియో మనకు తెలియవచ్చుట లేదు. వృత్తము మధ్యభాగమున త్రిశూలాధిష్ఠితమైన జ్వాలాస్తంభము ముందు సింహాసనమున్నది. ఈ సింహాసనము మీద "అవశేష" పూర్ణములైన గుండ్రని కరండములో ఏవో యుంచబడినవి. ఇవి రెండుభాగములుగ గాన్పించుచున్నవి. క్రిందిది కరండము యొక్క యడుగుభాగమును, పైది తెఱచియుంచిన పై మూతయును నగునేమో. దీనిపై 'స్వస్తిక' చిహ్నము కలదు. దీనికి కుడివైపున బౌద్ధభిక్షువు లీకరండమునకు నమస్కరించుచున్నారు. సింహాసనమునకు దిగువ నొకవేదికపై బుద్ధభగవానుని శ్రీపాదములు కలవు. వాటికి ముందు వినమ్రులై యిరువురు స్త్రీలు ప్రణమిల్లుచున్నారు. సింహాసనమున కెడమభాగమున దేశీయములైన యుడుపులను ధరించిన యొక ప్రభువు తనకుమారుని కరండసమీపమునకు గొనివచ్చి దానికి 'మ్రొక్కుబడి' చెల్లించుచున్నాడు.

అతని వెనుకనున్న వారందఱు ఆరాజకుటుంబమునకు సంబంధించిన వారు కావచ్చును. ఈ స్త్రీలు ధరించిన బంగారు జడలును, తలపూవులును, మువ్వలమొలనూళ్లును, హస్తాభరణవిశేషములును గమనింప దగినవి. మఱియొక్క విషయము. కుడివైపుననున్న బౌద్ధభిక్షువులు కుళ్లాయిలు ధరించియున్నారు. ఈ కుళ్లాయియొక్క వెనుకవైపు దిగువ భాగము ఎంతక్రిందికి దిగిన దానిని ధరించినవా డంతటి విద్యాధికుడట. అనగా విద్యాధికత ననుసరించి యా కుళ్లాయి వెనుకభాగము తగ్గుచు హెచ్చుచు నుండునని తెలిసికొనవలసియున్నది.

నాలుగవ చిత్రమునగూడ మధ్యసింహాసనమును, దానిమీద "అవశేష"కరండమో ద్రోణమో, అదియును, సింహాసనమునకు దిగువ వేదికను శ్రీపాదములును గలవు. దానివెనుక మూడవ చిత్రమునందు వలెనే జ్వాలాస్తంభము, త్రిశూలము కలవు. ఈ జ్వాలాస్తంభ, త్రిశూలములకెగువ ధర్మచక్రము కలదు. సాధారణముగా అమరావతీచిత్రములు వేటిలోను స్త్రీలు లేకపోలేదు; కాని యీ వృత్తచిత్రమున మాత్రము ఒక్క స్త్రీయైనను లేదు. ఆరాధకులందఱును పురుషులే. తలకట్టుల ననుసరించియు, ఇతరలక్షణముల ననుసరించియు జూచినచో వారందఱు నొక్కతెగవారుగ గనబడుదురు. ఇక శ్రీపాదములకు రెండు ప్రక్కల రెండుజింకలు చిత్రితమగుటయే యిందలి విచిత్రము.

ఆరవచిత్రము కూడ త్రిశూలచిత్రమునకు సంబంధించినదే. ఇచ్చటకూడ నొకసింహాసనమున్నది. దానిమీద అవశేషకరండము లేదు కాని శ్రీపాదములున్నవి. సింహాసనమునకు వెనుకప్రక్క త్రిశూలాధిష్ఠితమైన జ్వాలాస్తంభము కలదు. ఈ త్రిశూలము బౌద్ధమతమున దేనికిగుర్తో ఎవ్వరును తృప్తికరముగ జెప్పియుండలేదు. త్రిశూలము, స్వస్తికము మొదలైనచిహ్నములు జున్నార్, భాజా, బెడ్సా, కుదా, కార్లీ మొదలైనగుహాలలోని అత్యంతప్రాచీన శాసనముల ప్రారంభమునను, చివరను గానవచ్చుచుండుటచేత ఇవి కడుప్రాచీన కాలమునుండియు అదృష్టచిహ్నములుగ వాడుకలో నుండినట్లు కొందఱు చెప్పుచున్నారు. త్రిశూలము బౌద్ధమతమునకు సంబంధించిన చిహ్నముకాదేమో యని కొందఱు ఇదివఱలో సంశయించిరి కాని అమరావతీస్తూపచిత్రములలో నిది తరుచు గానవచ్చుచుండుటచేతను, మూడవ చిత్రమున బౌద్ధభిక్షువులే దానికి నమస్కరించుచుండుటచేతను దానిని బౌద్ధమత చిహ్నముగానే పరిగణింపవలసి వచ్చినది.

ఈయారవచిత్రమున ఎగువభాగమునందలి ప్రధానారాధకులు నాగులు. సింహాసనమునకు కుడియెడమ ప్రక్కల తలయొకరు కూర్చుండి

యున్నారు. వీరిరువురికి తలమీద ఏడు పడగ లున్నవి. వీరిరువురి పార్శ్వములు తలమీద ఒంటిపడగగల స్త్రీలు ఇరువురున్నారు. జ్వాలాస్తంభమున కిరుగెలంకుల చామరధారు లిరువురున్నారు. వారికి తలమీద పడగలు లేవు. ఇతరపరిచారకులును కొందఱు కలరు కాని వారికిని పడగలు లేవు.

ఈవృత్తచిత్రము మధ్యభాగమున సింహాసనము మీద కూర్చున్నవాడు నాగరాజు. ఇతని తలమీద తొమ్మిదిపడగలు కలవు. ఇతని రాణు లిరువురు ఇతనికి చెరియొక వైపున సింహాసనముమీదనే కూర్చున్నారు. రాణులకు కూడ నెత్తిమీద చెఱియొకపడగ కలదు. సింహాసనము వెనుక నాగరాజునకు రెండువైపుల నాగకన్యకలు వీచోపులిడుచున్నారు. వారికిని తలమీద ఒక్కొక్కపడగ గలదు. వీచోపులిడువారు మాత్రమే కాక మరి యిరువురు నాగకన్యలు కుడివైపున సింహాసనము వెనుక నిలువబడియున్నారు. వీరికిని తలమీద పడగకలదు. వీరును రాణులపరిజనమే కావచ్చును. వీరితోపాటే ఎడమవైపు మరియిరువురు పరిచారకులు నిలుచుండి యున్నారు. నెత్తిమీద వీరికి పడగలు లేవు. నాగరాజునకు దూరమున ఇరుగడల నిరువురుస్త్రీలు—వీరికిని తలమీద పడగ యుండుటచేతవీరును నాగులే కావచ్చు—రెండువైపులనున్న చెట్లకొమ్మలను-కుడివైపున నున్నది ఎడమచేతితోను, ఎడమవైపుననున్నది కుడిచేతితోను-పట్టుకొనియున్నారు. వీరిరువురికి పరిచారకులు కలరు. కుడివైపున్న పరిచారిక కుడిచేతితో పూవును, ఎడమచేతితో కొమ్మను పట్టుకొనియున్న స్త్రీ కేదో పాత్రవంటి దందిచ్చుచున్నది. ఈమెకు నెత్తిమీద పడగగలదు. ఎడమవైపుననున్న పరిచారకుడు పిడికలిగిన గుండ్రనివస్తువును దేనినో ఎడమవైపుకొమ్మను పట్టుకొనియున్న స్త్రీకందిచ్చుచున్నాడు. ఈస్త్రీ ముందొకయున్న తాసనము కలదు. దానిమీద నామె తనకుడిమోకాలు నానించికొని యున్నది. నాగరాజునకుముందు ఎడమవైపు ముగ్గురు నాగకన్యకలు కూర్చుండి యున్నారు. వారు పాటకురాండ్రో ఏమో! వీరందఱికి తలమీద పడగ యున్నది. ఈచిత్రముల నన్నిటిని పరిశీలించినచో నాగజాతిస్త్రీకి తలమీద ఒక్కపడగయు, పురుషునికి పెక్కుపడగలు నుండునట్లు తోచును. కూర్చుండిన ముగ్గురు నాగజాతిస్త్రీలకు ఎదురుగ కుడివైపున ఒకస్త్రీ నాట్యము చేయుచున్న విధమున నున్నది. ఆమెను వెనుకనుంచి యొక నాగకన్యక పట్టుకొనుచున్నది. ఈమె వెనుక బల్లమీద నేదియో యొక చిన్న పాత్రకలదు. అన్నిటికంటె దిగువభాగమున కమలములు, హంసలు, కలువలు మొదలైనవి కలవు.

ఈచిత్రమునందలి యితివృత్తమేదియో బోధపడుటలేదు. బౌద్ధవాఙ్మయము నింకను బాగుగ జదివిన గాని యిట్టి యితివృత్తములు తెలియరావు కాని గాథలుమాత్రము బౌద్ధయుగమునకు సంబంధించినవే యని నిస్సంశయముగ జెప్పవచ్చును.

అమరావతీ స్తూపమున నాగులచిత్రము లనేకములు కలవు. పడగలులేనివారలు ఏజాతివారో తెలిసికొన సాధ్యముకాదు. బట్టకట్టులోను, జుట్టుకట్టులోను వారును, నాగులు నొక్కరీతినే యున్నారు. వీరందఱు నాగరాజులచే పరిపాలింపబడు వారగుదురేమో. ఈస్తూపచిత్రము లన్నిటిలో నాగులచిత్రములు ప్రధానములుగ గాన్పించుచుండుటచేత నాగులకును అమరావతీ స్తూపమునకును ఏదో సంబంధ మున్నట్లు కనబడును. టిబెట్టు బౌద్ధగ్రంథముల ననుసరించి నాగార్జునాచార్యులవారు నాగలోకమునకు వెళ్లిరనియు, అచ్చటి నుండియే కొన్నితంత్రములను వెంటనో దీసికొని ధాన్యకటకమునకు వచ్చిరనియు ఏవో గ్రంథముల జదివిన జ్ఞాపకము. మహాయాన బౌద్ధముకూడ నొకవిధముగ తాంత్రికమే యని కొందఱందురు. ఏది యెట్లయినను ఈప్రాంతము నాగుల కునికిపట్టని కాని, ధాన్యకటకమునకు నాగులకు నెక్కువ సంబంధముండి యుండునని కాని, మహాదేవుని ప్రయత్నముల మూలమున ఈప్రాంతమున బౌద్ధమతము నవలంబించినవారలు ప్రధానముగ నాగులై యుండిరని కాని, నాగార్జునాచార్యులవారికిని నాగులకును కలననుసంబంధమున నేదియో కొంత సత్యముండునని కాని విశ్వసింపవలసి యుండును.

ఇక ఐదవ చిత్రములోని చిత్రమును జూతము. ఒక పటములో ఏనుగుపైన ఒకరాజు ముందుకూర్చున్నాడు. అతనివెనుక నిరువురుస్త్రీలు కూర్చున్నారు. వీరందఱును నదిని-కృష్ణయేమో-దాటుచున్నారు. పడవ ఒడ్డు చేరగనే రాజు వెనుక కూర్చున్నవారు క్రిందికి దిగి తమకొఱకు వేచియున్న యిరువురుస్త్రీలను కౌగిలించుకొనుచున్నారు. వేఱొకస్త్రీ రాజునకు నమస్కరించుచున్నది.

పడవకు దిగువభాగమున నొక యాసనమున నొక స్త్రీ కూర్చుండియున్నది. ఈమెకు ఎడమప్రక్క నిరువురు పరిచారిక లున్నారు. అందొకతె ఏదియో తినుటకామె కందిచ్చుచున్నది. రెండవది తన యెడమ క్రిందికి కడవలోనుండి ఆమెకు త్రాగ నిచ్చుటకై పానీయము నొక పాత్రలో నింపికొనుచున్నది. ఆమెకు కుడిచేతిప్రక్క సంగీత, జంత్రవాద్యకుశలురైన స్త్రీలు కలరు. వారిలో నొకరు పిల్లనగ్రోవి వాయించుచున్నారు. మఱియొకరు 'సితారు'వంటి దానిని దేనినో మీటుచున్నారు. ఈ సంగీతపాటకుల కెదురుగ సింహాసనమున నాసీనులై యిరువురు స్త్రీలు కలరు. ఆరవ పటములోని దానివలెనే ఇందలి యితివృత్తముకూడ తెలియవచ్చుటలేదు. ఇప్పుడుకూడ మనము చిత్రముల సౌందర్యము నుపలక్షించి తనివి నొందవలసిన వారమే.

ఏడు, ఎనిమిది చిత్రములలోని గాథలును మనకు దెలియరానివే. అయినను ఎనిమిదవ చిత్రపటములోనిది నిజమున కొకగాథ కాదు. ఆపటమధ్యమున నొక్కడు బుద్ధుని దగ్ధావశేషము నొక పాత్రయందుంచి దాని నొకపల్లకమునకునిడి, దానిని నెత్తిపై బెట్టికొని యున్నాడు. స్త్రీ పురుషులో, లేక దేవతలును, అప్సరసలుతో నలయాకార

ముగ నాయనవేషధారి చుట్టు దిరుగుచు అత్యంతోత్సాహమునను, భిక్షావేశమునను నృత్యము చేయుచున్నారు. పటమున స్త్రీలందఱు పల్లెరమునకు వెనుకతట్టునను, పురుషులందఱు ముందుతట్టునను గన్పించుచున్నారు. ఇదియే ఎనిమిదవ చిత్రమునందలి వృత్తాంతము.

ఏడవ చిత్రమున సింహాసనమున నొక మహానుభావుడు పరివేషవిరాజితుడై కూర్చున్నాడు. అతనికి చేరియొక ప్రక్క రెండు ఉన్నతాసనముల మీద అతని రాణులు కూర్చున్నారు. వీరికి ప్రక్కలను, ఎదురను వీరికి సంబంధించిన పరిజన మున్నారు. వీరికి దిగువభాగమున, ఎడమచేతివైపు గీతవాద్యాదులందు ప్రవృత్తలైన స్త్రీలు కలరు. వీరికి కుడిప్రక్క దిగువ కొందఱు నృత్యము చేయుచున్నారు. వీరి కెదురను, కుడిప్రక్కను స్త్రీలు కొందఱు కూర్చుండి యీవినోదమును విలకించుచున్నారు. ఇంతవఱకే మనకు తెలియవచ్చునది. ఈచిత్రమునందలి యితివృత్తమేమో మనకు తెలియదు.

అమరావతీ స్తూపముమీద "బౌద్ధపురాణ గాథలే కాక ఆకాలపు రాజసభలును, పట్టణగ్రామ పరిసరములును, యుద్ధరంగములును, సముద్రప్రయాణములును, వేషేల, ఆకాలపు రాజకీయ, సాంఘికస్థితి యంతయు కన్నులకుగట్టినటు లతిమనోహరముగ చెక్కబడియున్నవి. ఇందుగల ప్రతివృత్తాంతమును, గాథయు బయస్కోపులోని పటములవలె నొకదాని తరువాత నొకటి వచ్చునట్లు పటములమీద వరుసగా చెక్కబడియున్నవి. ప్రతిపటమునందును శిల్పకారుల మత్యద్భుతముగ నుండుటయే గాక జీవకళ లుట్టిపడుచుండును. ఈచిత్రపటముల వలన హిందూదేశమునందు, ముఖ్యముగ నాంధ్రదేశమునందు వ్యాప్తిచెందిన బౌద్ధమతస్వరూపము పూర్తిగ దెలియవచ్చుచున్నది. వీనినుండి అప్పటికే జనులు బుద్ధు నొకయవతారముగ నెంచి పూజింప మొదలిడిరనియు, అతనినిగూర్చి పెక్కు పురాణ గాథ లల్లి వానిని నమ్ముచుండిరనియు మనము గ్రహింపవచ్చును." 1

ఇట్లు మనకు ఇతివృత్తములు తెలియరాని చిత్రములెన్నియో అమరావతీస్తూపమున చిత్రితములైనవి కలవు. వాటినన్నిటిని బాగుగ పరిశీలించి యితివృత్తములను నిర్ధారణచేసి లోకమునకు విశదీకరింపవలసియున్నది. క్రీస్తుశకము ప్రాథమిక శతాబ్దములలో బౌద్ధమతము ఆంధ్రదేశమున ప్రబలిననాడు ఆంధ్రుల యాచారవ్యవహారములను, దుస్తులను, ఆభరణాదికములను, సాంఘికములైన గాథలను - వీటినన్నిటిని దెలిసికొనుటకు అమరావతీ స్తూప మాంధ్రులకు పెన్నిధివంటిది. ఆంధ్రుల ప్రత్యేక వ్యక్తిత్వము(Individuality)ను, ఆంధ్రుల ప్రతిభను నిర్ణయించి తెలిసికొనుటకు మనకుగల ప్రధానాధారములలో అమరావతీ స్తూప మొకటి.

1. ఆంధ్రవిజ్ఞాన సర్వస్వము, మూడవ సంపుటము.

వెలస్వల్పము! ఫల మధికము!! పరీక్షించదగినది!!!

# నారసింహ లేహ్యము




దీనియందు బంగారు, వెండిరేకులు, పచ్చకర్పూరము, కుంకుమపువ్వు, సాలామిశ్రి సఫేదామిశ్రి మొదలగు అనేకవిధములగు వస్తువులతో తయారుచేయబడియున్నది. ఇదిమిక్కిలి వీర్యవృద్ధిని, బలమును కలిగించుటలో అత్యుత్తమమయినది. మేహము, నిద్రలో స్కలనము, శుక్లనష్టము, సంసార సౌఖ్య లోపము, మూత్రముతోపాటు శుక్లము పడుట, మొదలగువానిని ఖండించును. బలహీనమైన యింద్రియమును పుష్టిపరచును. రక్తమును శుద్ధిపరచి వృద్ధిచేయును. అతిమూత్రమును ఖండించును. వృద్ధులకైనను యౌవనమును బలమును, కాంతిని, సంసారసౌఖ్యమును, ముఖ్యముగా ధాతుపుష్టిని సంతానప్రాప్తిని గలిగించు వరప్రసాదము. అనేక యోగ్యతాపత్రములు వచ్చియున్నవి. 2 డబ్బీలు తెప్పించి పరీక్షించినవారలు మరలమరల తెప్పించుకొనుటయే దీని ప్రాశస్త్యమునకు ప్రబలసాక్ష్యము. 2 డబ్బీలు చాలును. 20 తులముల డబ్బీ రు 2—8—0 పోస్టేజి 0—6—0

(నోటు:— సం ప్రతి 20 తులముల లేహ్యమునందున్న 3-12-0 లు విలువగల ¼ తులం లోహభస్మము కలిపి సేవించినయెడల మహోదకము మొదలగు రోగములను శీఘ్రముగా పోగొట్టుటయేకాక ముఖ్యముగా వీర్యవృద్ధిని, బలమును కలిగించుటలో సందియము లేదు.)

20 తులముల లేహ్యము, లోహభస్మము కలిపి రు 6—4—0 పోస్టేజి రు 0—6—0

ఒక్కలాభము:— 3 డబ్బాలలేహ్యము ఏకకాలమందు తెప్పించుకొనినచో రు 1-కి 0—2—0 కమీషను తగ్గించి పంపెదము. అన్ని ఔషధములు గల మా క్యాటలాగు యుచితము.

**పి. శి. ఏ. అండు కంపెని, ఆయుర్వేద సమాజం — పెరిదేపి — నెల్లూరుజిల్లా.**

---

చౌకధరలు! చౌకధరలు!!

# స్వయంశిక్షా సంస్కృత గ్రంథములు

శిష్యాలాచార్యత్వో 1—8—0

న. స్వామినాథశాస్త్రీకృతము.

తెలుగు లిపిలో తెలుగు అర్థములతో వ్రాయబడినవి.

ఉపవాచకములు

శబ్దరూపావళి 0 5 0; నీతికథాస్తుతి 0-12-0; బాలకాదంబరి (పద్యము) 0 6 0; లింగానుశాసనము 0 4 0; ధాతురూపచంద్రిక 0 4 0. ఈ అయిదున్ను ఒక్కసారిగా కొనువారికి ఇవి 1 0 0 కే ఇవ్వబడును.

Outlines of Sanskrit Grammar 1 8 0

అడ్రసు:—

ఎన్. ఎస్. నీలకంఠం
C/o
ఎన్. ఎస్. నరసింహం, ఎం. ఏ.,
ట్రయినింగు కాలేజి, రాజమండ్రి.

---

## శాస్త్రీస్ గనేరియా క్యూర్



అన్నివిధములయిన శగరోగములు, స్త్రీల బహిష్టు మొదలగు సకల మూత్ర వ్యాధులకు అత్యద్భుతముగా పనిచేయును.

వెల సీసా 1-కి రు. 3.

పోస్టుఖర్చు ప్రత్యేకము.

వివరములకు నేడే వ్రాయుడు.

మా అవుషధములన్నియు రసవిషగంధకములు చేర్చక కేవలము, మూలికలు, భస్మములచే తయారగుచున్నవి.

**V. S. SASTRY & SONS.,**
**Chemists, Druggists and Opticians, Tenali. S. S.**

# నిగళబద్ధకవి

బొమ్మరాజు జానకిరామశర్మ గారు

(ఆత్మగతము)

కో సుకక పల్కేగా “పడుపుఁగూడు” నరాంకితమంచు పోతరా
“జిసి”యని రోయుచున్ హితధరేశులు “గస్తురి” “రోజువచ్చెమున్”
విసువక యిచ్చువారుఁ జన నేఁగృతిమానుచు బొడ్డుపల్లిలోఁ
“బెసలుతిలల్” పొలాన వెదపెట్టితి నక్కట! సేద్యగాడనై.

సీ. గౌడడిండిమభట్టు కంచుఢక్కను వోలెఁ బగులఁగొట్టితి నట్టు వడినగడ్డ
సత్కథాబీజముల్ సంతరించినయట్లు విత్తించితిని పంటవిత్తనముల
దీనారటంకాలఁ దీర్థమాడినరీతి మంచపైనుంటి సశ్మముల వానఁ
తెలుఁగురాయండిచ్చు దివ్యకస్తూరినా చేపట్టి ముఱిసితి చేనియెఱువు
పూలనమ్మిన యంగడిఁ బుద్ధిలేక, కట్టె లమ్మినరీతినిఁ గనకలేఖి
నిన్ వహించిన చేతనే గునపమంది, గట్లు విఱచితి చేతులు కాయఁగాయ.

మ. గరిటెన్ నాకి వ్రతమ్మునుం జెఱచితిన్ గాకేమి యీనాఁడు భూ
వసులే న్నాదు దరిద్రదేవతను గూల్పన్ జాలకేపోయి రీ
ధరణి న్నమ్మిన “కృష్ణవేణి” కృప యింతన్ జూపి సర్వస్వమున్
హరియించెన్ దురదృష్టునిన్ ధనికుఁ జేయన్ శక్యమే యెరికిన్!

సీ. “ప్రాప్తమా లేశమే పదివే”లనుచు నమ్ము పోతరాజున కిది పోలెగాక
“ఆకఁటికిన్ నిను నమ్మ భారతి” యన్న పోతరాజున కిది పోలె గాక
“నమ్మెట వ్రేటుల” సమ్మతింపని మేటి పోతరాజున కిది పోలుఁగాక
“పడుపుగూడు” భుజింపఁ జాలుపడని శుచి పోతరాజున కిది పోలుగాక
గీ. లేకి ధనికుల సభలలో లేచి స్వర్ణ-కింకిణులు మ్రోయఁ గృతికన్యఁ గొంకులేక
యెలమి నర్తింపఁజేసిన ఖలమతికిని - సాధుకర్షకత విధికి సమ్మతంబె?

శా. లేరా! ముందునుఁ గల్గరా! కృతుల నీలీలన్ ధరాపాలురన్
పేరుంజేర్చి నుతించు సత్కవులుగానీ యొక్క పాత్రమ్మునేన్
శ్రీరామాంకితమో! శివాంకితమునో జేయంగ వాంఛింతు ర
య్యారే! నే నటువంటి భాగ్యమునకైనా! నోచనైతిన్ గదా!

గీ. మహిపతులు మంత్రిజనులుఁ గోమట్లు శూద్రు-లౌర? వీరని వారని యనఁగ నేల?
“వీథి”నంగడియందున పెట్టి యెల్ల-వారి కమ్మితి పద్యముల్ పాపమనక.

గీ. ఏడునూరుల టంకమ్ము లిచ్చువఱకుఁ-గదలనీయఁడు కంసాలి కరణ మిపుడు
ఆకలికి నోర్వవలెనో! ఘోరావమాన-వహ్ని తాపము నోర్వంగవలెనో, అకట!

మ. గమికర్మీకృతనైకనీవృతుఁడనై గ్రామంబు గ్రామంబు బ
ల్భ్రమునుం గాలికి కట్టి తిర్గితిని తద్గ్రామంబులన్ జారిణీ
రమణీవర్ణన, లోభివర్ణనము నైరాశ్యంబునన్ గూర్చి ప
ద్యములం బాడితిఁగాని వేలుపులు లేరా? పద్య మీఁగూడదా?

గీ. నేలనాలుఁగుచెఱగుల నేలినట్టి - పృథ్వీపతులకుఁ జేతిజంబీరమైన
నే నిపుడు చేతు లిటికించి నిగళమందు - కాపుఁ గరణాల సభలోనఁ గట్టువడితి.

సీ. వీరభద్రారెడ్డి విద్యాంసుఁడగు నేమి! యాంధ్రనైషధకర్త యైన నేమి?
కవిరాజ బిరుదంబుఁ గల్గియుండిన నేమి? సార్వభౌమాభిఖ్య చాలి నేమి?
విస్సనమంత్రికి విందనయిన నేమి భాస్కరుమైత్రిచేఁ బఱఁగ నేమి?
మైలారువిభుని ప్రేమముఁ జూఱఁగొన నేమి? డిండిమభట్టు గెల్చియును నేమి?
గీ. కాపుఁగరణాలఁ బాదరక్షలను లేచు - రచ్చమిట్టలదుమ్ములో వచ్చువారు
పోవువారును నూఱడింపులను సేయ-బందకొయ్యనుఁ గౌగిటఁ బట్టవలసె.

శా. తల్లీ! శారద! నీకు నావలన మత్యాన్యప్రపంచమ్మునం
దెల్లన్ సుంతయు మేలుకల్గద! రవంతేన్ నీదు పుత్రాళికే
యుల్లాసంబునుఁ గల్గలేద! కలదే నీనేళ తద్భాగ్య సం
పల్లంభంబున నేను ముక్తిపదముం బ్రాపింపఁగాఁ జేయవే!

గీ. ప్రభులకీర్తినిఁ జెల్పి నాప్రతిభఁ జూపి-ధరణి నాకావ్య మాచంద్రతారకముగ
నుండునే నిఁక, నాకు లేకున్న దేమి!-యేను మృతజీవుఁడనె యాంధ్ర(?)విషయమందు.

గీ. శారదోపాసనారసాస్వాదసిద్ధు-లందు నే నొకఁడను ప్రళయముననైన
అభవుఁడ విముక్తమునువలె హరికీర్తి-లోకసుక్షేత్రమునను వెల్గుదును నేను.

మ. కలిదోషాహరణంబుఁగా నలుని యాఖ్యానంబు వర్ణించితిన్
విలసత్సూక్తుల కాశిఖండమునఁనన్ విజ్ఞాళి మెప్పించితిన్
పలుకన్ నేర్చితి చక్రవర్తులను శైవక్షేత్రసంపత్తినిన్
బలుకుందోడయి వాణి రా దరిగితిన్ భాషాప్రపంచమ్మునన్

మ. కనియుం బెంచియుఁ బెద్దఁజేసి చనిరేకా నన్నయాదుల్ మహా
ఘను లావేళను దిక్కులేని నిను వేడ్కం జేరఁగాదీసి పా

వన రీతుల్ గతు లుల్లసిల్ల నృపసంభావ్యస్థితిం గూర్చినా
నని విశ్వాసమెయున్న నీకు దయరాదా! నాపయిన్ భారతీ!

'ఆంధ్రవాణి'

గీ. తనయ! నీసేవ నే నింత దాస నైతి-ఖండఖండాంతరములఁ గీర్తిగాంచినాను
పరమ పుణ్యుఁడ వీవు నీ భవ్యకీర్తి - శాశ్వతము శాశ్వతమ్మును శాశ్వతమ్ము.

గీ. సకల కర్ణాటరాజులు మకుటరత్న-కాంతి నీపదములకడఁ గానుకవెట్టి
రదియు నాకుఁ బ్రతిష్ఠగ నాత్మఁదలతు-అపగతవిభేదనై "త్వమేవాహ" మనుచు.

ఉ. పంకజగర్భదేవు తలవాకిట నెన్నిదినాలు నేను ని
శ్శంకముగాఁ జరింతునో లసద్గతి నంతటిదాక నీవు మ
త్కింకరభావమొప్ప నవకీర్తిశరీరముతోఁ బునర్జను
స్సంకటముల్ తొలంగఁగఁ బ్రచారము సేయుము భావవీథులన్.

క. అన్నన్న? నీకు భవమనుక - పున్నదె? నీ చేతిభిక్ష యుర్వినిఁ గం "పె
ద్దన్న" మొదలుకొని గం దద్దన్న కవులనందఱకుఁ బ్రస్తుతం బాంధ్రమునన్.

శా. నీసంపైసను సేదుచేయు దగుచున్ శృంగారభూషానము
ల్లాసాపాదకహేమ సువర్ణమగుచున్ లాలిత్యముంగాంచఁ బె
ల్లాసం బొందియుఁ బశ్యతోహరులునై యాంధ్రావనిన్ సత్కవుల్
నీసంపైనను సంగ్రహింప కెటులన్ వీడంగలారో! కవీ?

(అని యదృశ్య యగును.)

---

## ఈశ్వరా!

సోమంచి సూర్యనారాయణశర్మ గారు

ఇంచుక యాయు వద్ది హరియింప జరాపిజ జలో నొక్కెడన్
మించి యతింపుచుండు నటు మిత్తి గుటుక్కున గుక్క వేయగా
బొంచియు నుండు వెంట నిది బుద్ధి నెఱింగియు బామరుండ ని
శ్చంచలవృత్తి నీయెడల నల్పపు భక్తి నిసీ! మహేశ్వరా!

మంచితనంబు ధూర్తమతి బట్టుటకున్ జెడుదారినుండి మ
ళ్లించుట కెట్లు చాలునో హరీ హరి! యెన్నడు దొంగవాకిటన్

మంచము వేయు మందురు క్రమంబుగ నా బెద్దలు సుద్దు లందుర్గా
గొంచెడివారి కేమిగతి గూర్చినవాడ వహో! మహేశ్వరా!

చంచల మీ సమస్తము నసారము సంసరణం బటంచు గు
ప్పించు విరాగవాక్యములు వేయివిధంబుల మాతృహత్యకే
గొంచెపు పైడి గూడ గను గొంచెము పీ గ్గనుపెంచినట్టి దృగా
భ్యంచితకూప మట్టి ఘనవంచకు బారికి దప్పి యొగ్గో వ
ర్తించు వివేకి దారి గనుతింపగబోలదటో మహేశ్వరా!

సంచులకొద్ది విత్తమును జాతురిమై గడియించనీ, మహా
వంచకబుద్ధి భూములు నపారముగా గొని యాక్రమించనీ,
క్రించులు గూడి సంఘమును గ్రిందను మీదను జేయనీ, నుతుల్
గాంచి రహించనీ, దొరలె గౌరవనీయు డటంచు మ్రొక్కనీ,
ఇంచుక లేక నీకరుణ యెట్లు తరించునయా, మహేశ్వరా

పంచి భుజించుటే సుజనపద్ధతి కొంచెపుమైన; దప్పు యో
జించి యొసర్చినట్టిదను చక్కని చక్కని కార్య; మొందు లా
లించి యొసంగునట్టిదయ యింపగు భోనము; సిరులం ద
గ్గించెడి జాలె కైతి; యిది సత్యము సత్యమురా, మహేశ్వరా!

## శ్రుతి లేని

అడివి బాపిరాజు గారు, బి. ఏ.

పాడకే నారాణి
పాడకే పాట,
పాటమాధుర్యాల ప్రాణాలు మరిగెనే,
పాడకే నారాణి పాడకే పాట.

రాగ మాలాపించి
వాగులా ప్రవహించి,
సుడిదిరుగు గీతాల సురిగిపోసీయకే,
పాడకే నారాణి పాడకే పాట.

కరవీర కోరకాల్
కదలి నీ పెదవులే
ప్రణయపద మంత్రాల బంధించె జీవనము
పాడకే నారాణి పాడకే పాట.

శ్రుతిలేని నాహృదికి
చతురగీతం బేల?
గతిరాని పాదాల కతుల నర్తనమేల?
పాడకే నారాణి పాడకే పాట.



చిత్రము ౧౫

# సర్వవృశ్చిక విషసంజీవిని (రిజిష్టర్డు)




ఇది ప్రతికుటుంబమునందుండవలసిన ముఖ్యౌషధము. యెన్ని దినములుంచినను మందుగుణము మారదు.

తేలుకకుమాత్రమేగాక ఎలుక కుక్క పాము జెర్రి మొదలగు విషజంతువుల కాట్లకునుపయోగింపవచ్చును.

గుణములేదని రుజువు చేయువారలకు 100 రూపాయలు ఇనామివ్వబడును.

ప్యాకెట్టు 1-కి వెల అ. 8.

1 డజన్ ప్యాకెట్లు వెల రూ. 5.

పోస్టేజి వేరు.

ఒకేసారి 4 ప్యాకెట్లు గొనువారలకు పోస్టేజి ఇనాం.

వర్తకులకు 100-కి 25 రూ. కమీషను ఇవ్వబడును.

## ఉదర క్రిమి సంహార బిళ్ళలు

ఈ బిళ్లలో ఒకసంవత్సరపు శిశువులకు అరబిళ్లయును, ఇతరులకు ఒకటి లేక రెండుబిళ్లలు చొప్పునను యిచ్చినయెడల కడుపులోనుండు చిరుపురుగులును, ఏలికపాములును ఉంటఉంటలుగా బయలుపడును. 8 బిళ్లలు 0-8-0.

## ధనలక్ష్మి అండు కంపెని,

6, వెంకటేశమేస్త్రివీధి, సౌకారుపేట, మద్రాసు.

---

త్వరపడుడు! త్వరపడుడు!!

# సతీపతి కుతూహల రహస్యములు

ఇకను మోసపు పుస్తకములను కొని మోసపోకుడు !!!

ఇట్టి గ్రంథ మిదివర కాంధ్రభాషలో వెలువడియుండలేదు. ఇందు గృహస్థాశ్రమధర్మము, సతీపతు లన్యోన్యప్రేమతో వర్తిలగలవిధులు, ప్రేమతత్వము, స్త్రీజాతులు, పురుషజాతులు, వాని ప్రవర్తనలు, జాతుల పొంతనములు, వానియొక్క అభిప్రాయము, శయ్యాగృహరహస్యములు, వానిలక్షణములు, ఎట్టి సతీపతుల కెట్టి సంతానము గలుగు ననువిషయము, గర్భవిషయములు, గర్భస్త్రీలనుసరింపవలసిన విధులు, గర్భవతుల యారోగ్యావశ్యకత, శిశురక్షణ, అత్తకోడండ్ర వైరములకు గల కారణములు, వానిని శమింపజేయు నుపాయములు, వారి కుండవలసిన స్నేహావశ్యకత, మున్నగు 280 విషయములతోను, సందర్భానుసారముగ గల ఆఫ్‌టోన్, లైన్ బ్లాకులు 25తోను గ్లేజు 410 పేజీల పైబడిన సీమకాలికోతోను చక్కనిబైండుతో విరాజిల్లుచున్నది. ప్రతి గృహస్థుడు తప్పక చదివియే తీరవలెను. కొద్దిప్రతులే గలవు.

పుస్తకము 1-కి రు. 2-0-0. పోస్టేజి 7 అణాలు.

2 పుస్తకములొకేసారి కొనువారికి తపాలఖర్చు లేదు.

మా చిరునామా:—ఆర్యన్ బుక్ డిపో,

19, తాండవరాయ మొదలివీధి, తిరువళిక్కేణి, మద్రాసు.

---

ఆంగ్లభాషా పరిచయము లేనివారలకు బహుసులభముగ నేర్చుకొనుటకు తెలుగుఅర్థములతో నుండు

# ఆనంద ఆంగ్లభాషాబోధిని

అనుగ్రంథము మిక్కిలి సహకారిగ నుండును.

ఇది 700 పేజీలు చక్కనికాలికోబైండు, భారతకథలు, ఆకథలకుసంబంధించిన 16 ఆఫ్‌టోనుపటములు గలిగియున్నది. దీనియందు ప్రతిపదమునకు తెలుగుఉచ్ఛారణ, ఇంగ్లీషుపదములు, అర్థముచేర్చి నేర్చుకొనువారలకు బహు




సులభముగ తెలియుటకు ముద్రించితిమి. ఇంగ్లీషుపాఠశాలలో 10 సం॥లు వేలకొలది రూ॥లు ఖర్చుచేసి సంపాదించినజ్ఞానమును యింటియందుండియే సంపాదింపనగును. ఉపాధ్యాయుల వెదకపనిలేదు. గ్రామోద్యోగులు, కరణములు, దొరలతో సంబంధముగల బట్లర్లు, సంతవారలు మరియితర సిబ్బందులు వీరలకును, ఆంగ్లభాషాపరిచయము లేని వారలకును, మా ఆనంద ఆంగ్లభాషాబోధిని చాల ఉపకారిగ నుండును. ప్రతి కుటుంబమునకును ఇది ముఖ్యావశ్యకము.

పుస్తకమువెల రూ. 2-0-0.

ఒకపుస్తకమే కొనువారికి పోస్టుఖర్చులు అ. 8 యగును 2 ప్రతుల నొకేసారికొనిన పోస్టుఖర్చులు మేమేభరించెదము

## ఆనందబోధిని ఆఫీసు,

పోస్టుబాక్సు నెం. 167, మద్రాసు.

## అమృతాంజనం డిపోవారి సుప్రసిద్ధౌషధముల జాబితా

| | | | |
|---|---|---|---|
| 1. జీర్ణరసాయనము మాత్రలు | 1 | 4 | |
| 2. వజ్రగుళికలు, ధాతుపుష్టికి | 1 | 0 | |
| 3. జ్వరహారి, జ్వరములకు సీసా 1 కి | 0 | 12 | |
| 4. అమృతాంజనము సీసా 1 కి | 0 | 10 | |
| 5. దుూలశంకకు తైలము, డబ్బి 1 కి | 0 | 12 | |
| 6. తామరతైలము, తామర, తీటకు | 0 | 6 | |
| 7. కలరా మాత్రలు, వాంతిభేదులకు | 0 | 6 | |
| 8. తేలుమందు, తేలుకాటుకు సీసా 1 కి | 0 | 8 | |
| 9. దంతశూలహారి, పండ్లపోటుకు | 0 | 8 | |
| 10. కర్ణశూలహారి, చెవిపోటుకు | 0 | 6 | |
| 11. గజ్జికి తైలము, గజ్జిచీడలకు డబ్బి 1 కి | 0 | 4 | |
| 12. పగుళ్లకు తైలము, శీతపగుళ్లకు | 0 | 6 | |
| 13. పేలకు మందు సీసా 1 కి | 0 | 4 | |
| 14. చందన అత్తరు 1 ఔన్సు | 2 | 0 | |
| 15. కుష్టుకు తైలము, డబ్బి 1 కి | 0 | 8 | |
| 16. దంతచూర్ణము, పండ్లు తోముటకు | 0 | 2 | |
| 17. సుఖభోగిమాత్రలు | 1 | 0 | |
| 18. సుఖభోగితైలము, పుండ్లకు | 1 | 0 | |
| 19. రోమహారి, వెండ్రుకలు ఊడుటకు | 0 | 8 | |
| 20. మోహినీతైలము, వెండ్రుకలకు | 0 | 12 | |
| 21. చుండుకు నూనె సీసా 1 కి | 0 | 6 | |
| 22. గ్రహణిమాత్రలు డబ్బి 1 కి | 0 | 8 | |
| 23. జులాబి మాత్రలు, మలబద్ధమునకు | 0 | 8 | |
| 24. కుసుమారి మాత్రలు | 1 | 0 | |
| 25. సెగకు ద్రావకము సీసా 1 కి | 1 | 0 | |
| 26. కఫహారి, శీతగట్టు దగ్గులకు | 1 | 0 | |
| 27. కఫహారిచూర్ణము డబ్బి 1 కి | 0 | 8 | |
| 28. సుందరితైలము ,, | 0 | 8 | |
| 29. శిరోవేదనమాత్రలు, తలనొప్పులకు | 0 | 12 | |
| 30. నేత్రాంజనము, కంటివ్యాధులకు | 0 | 4 | |
| 31. ఉబ్బసమునకు మందు | 2 | 0 | |
| 32. వాయువుపోట్లకు మందు డబ్బి 1 కి | 1 | 0 | |
| 33. విరేచనములకు మాత్రలు ,, | 0 | 8 | |
| 34. కస్తూరిమాత్రలు, పెద్దవి 50 కి | 0 | 10 | |
| 35. వామకర్పూరము సీసా 1 కి | 0 | 6 | |
| 36. నేపాళదేశపు కస్తూరి తు. 1 కి | 36 | 0 | |
| 37. కుంకుమపువ్వు 1 వ రకం ,, | 3 | 0 | |
| 38. పచ్చకర్పూరం | 3 | 0 | |

అమృతాంజనం డిపో, బొంబాయి, మద్రాసు

# విభవ సంవత్సర విశేషములు

౧౯౨౮

మార్చి ౧౭. ఇండూరు హోల్కారు-నాన్సీమిల్లరుల వివాహము.

౨౧. శస్త్రనియమన (Disarmament) సమావేశము, జినీవా.

ఏప్రిల్ ౧౫. జటప్రోలు రాజావారి మృతి.

౨౭. అఖిలభారత హిందూమహాసభ- అధ్యక్షులు-యన్. సి. కేల్కారుగారు.

౨౩. మగన్‌లాల్ గాంధీగారి మరణము.

౨౮. డా॥ సుధీంద్రబోసుదంపతులు అమెరికానుండి భారతదేశమునకు వచ్చిచేరుట.

మే ౧. బార్డోలీయందు రైతుపన్నుల నిరాకరణ సత్యాగ్రహప్రారంభము.

౨. బళ్లారి రాఘవాచారిగారు విదేశములకు వెడలుట.

౧౫. సకలాంధ్రకవి సమ్మేళనము-శ్రీమునిపట్టణము.

౧౯. సర్వపక్షసమావేశము-బొంబాయి.

౨౭. పుదుక్కోట మహారాజావారి మృతి.

౩౧ నిజాంరాష్ట్రాంధ్రసభలు-సూర్యాపేట(౩ దినములు)

జూన్ ౧౦. ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారి మృతి.

౧౭. పండిత గోపబంధుదాసుగారి మృతి.

౨౮. కోవెలమూడి గోపాలకృష్ణయ్యచౌదరిగారి మృతి.

౨౭. నల్లపల్లి రాజావారి మృతి.

జులై ౧౩. ఆర్యవైశ్య మహాసభ-నాయల్పాకు.

౨౭. ఆంధ్రసభలు-గుంటూరు (౪ దినములు)

ఆగస్టు ౨. బార్డోలీకి గాంధీగారి ప్రయాణము.

౫. బార్డోలీ సత్యాగ్రహ పరిసమాప్తి.

౩౦. లక్నోయందు భారతస్వాతంత్ర్యసమితి స్థాపనము-స్థాపకులు: జవాహర్లాల్ నెహ్రూగారు.

సెప్టెంబరు ౧౨. సరోజినిదేవిగారి అమెరికా ప్రయాణము

౨౧. ప్రథమ అఖిల భారత రాష్ట్రీయ సహకారసంఘ మహాసభ-సిమ్లా.

౨౮. శ్రీరాజారామమోహనరాయల వర్ధంతి.

అక్టోబరు ౨. శ్రీగాంధీగారి ౬౦ వ జన్మదినము.

౮. 'హిందూ' ఆంగ్ల దినపత్రిక పంచాశద్వార్షికోత్సవము.

౧౯౨౮

౧౮. బర్కెన్‌హెడ్‌గారు ఇండియా మంత్రి పదవికి రాజీనామా నిచ్చుట.

౨౧. కాకినాడ ప్రాంతములు జలప్రళయము.

౨౨. శ్రీపిఠాపురము మహారాజావారు బ్రహ్మమతప్రచారమునకై ౧ లక్షరూపాయలు విరాళమొసగుట.

౨౩. ఇండియా మంత్రి పదవికి పీల్ ప్రభువుగారి నియామకము.

౨౫. లామెంబరగు గౌ॥ యస్. ఆర్. దాసుగారి మృతి.

౨౯. అఖిలభారత నవ్య బ్రాహ్మణ మహాసభ-కాశీ.(౧౦ దినములు) అధ్యక్షులు- దర్భాంగ మహారాజాగారు.

౩౦. లజపతిరాయిగారికి పోలీసు లాఠీదెబ్బలు తగులుట.

నవంబరు ౩. అఖిలభారత కాంగ్రెసుసంఘ సమావేశము-ఢిల్లీ.

౫. బార్డోలీ సత్యాగ్రహ విచారణ ప్రారంభము.

౮. హెర్బర్టు హూవరుగారు అమెరికను ప్రజాస్వామిక ప్రభుత్వాధ్యక్షులుగ నెన్నుకొనబడుట.

౧౦. జపాను చక్రవర్తి హిరోహిటోగారి పట్టాభిషేకము.

౧౮. లాలాలజపతిరాయిగారి మృతి.

౧౭. ౧౭వ ఆంధ్రరాష్ట్రీయ మహాసభ-నంద్యాల.

౨౦. అఖిలభారత ప్రాచ్యమహాసభ-లాహోరు అధ్యక్షులు డా. ఉల్వరుగారు.

౨౧. దక్షిణాఫ్రికా ఏజెంటు జనరలుగ కె. వి. రెడ్డినాయుడుగారి నియామకము.

౨౫. బొంబాయి రాష్ట్రప్రథమాంధ్ర సాంఘిక మహాసభ-కళ్యాణి. అధ్యక్షులు: వేమవరపు రామదాసుగారు.

౨౮. సర్. బ్రజేంద్రలాల్ మిత్తర్‌గారు, యస్. ఆర్. దాసుగారి స్థానమున లామెంబరుగ నియమింపబడుట.

(?) అఖిలభారత సాంఘిక మహాసభ-కలకత్తా. అధ్యక్షులు- యం. ఆర్. జయకర్‌గారు.

డిసెంబరు ౨ గుంటూరు, శారదా నికేతన పంచమ వార్షికోత్సవము.

౧౬. సర్ పానగల్ రాజాగారి మృతి.

౧౭. లాహోరునందు సాండర్సు హత్య,

౧౯. అఖిలభారత వాణిజ్య సంఘ మహాసభ-ఝరియా.

౧౯౨౯

డిసెంబరు ౧౯. ౪వ భారత తత్త్వశాస్త్ర మహాసభ - మదరాసు. అధ్యక్షులు-ఎ. బి. ధ్రువగారు (3 రోజులు)

౨౧. అఖిలభారత మహాసభా ప్రదర్శన ప్రారంభము కలకత్తా. ప్రారంభకులు: డా. అన్సారీగారు.

౨౨. అఖిలపక్ష సమావేశము, కలకత్తా.

౨౭. స్త్రీల సాంఘిక మహాసభ. అధ్యక్షురాలు-తిరువాన్కూరు జూనియరు రాణి.

౨౯. ౪౩వ భారత జాతీయ మహాజన సభ - కలకత్తా. అధ్యక్షులు-మోతీలాల్ నెహ్రూగారు.

౩౦. మితవాద మహాసభ - అలహాబాదు. అధ్యక్షులు-సర్. చిమన్‌లాల్ సెతల్‌వాడ్‌గారు.

౩౧. అఖిలపక్ష మహమ్మదీయ మహాసభ-ఢిల్లీ.

జనవరి ౧. అఖిలభారత పత్రికాసంపాదకుల మహాసభ - కలకత్తా అధ్యక్షులు-కె. నటరాజన్‌గారు.

౨. భారత ఆర్థిక మహాసభ-మైసూరు. అధ్యక్షులు-ప్రొఫెసరు వి. జి. కాలేగారు.

౩. రాష్ట్రేతరాంధ్ర మహాసభ-ఖర్గపురము. అధ్యక్షులు-గా. హరిసర్వోత్తమరావుగారు.

౪. భారత మహిళా విద్యాసంస్కరణసభ-పాట్నా అధ్యక్షురాలు-మండీసంస్థానపు రాణి.

౧౪. అఫ్గను అమీరు అమనుల్లాగారి రాజ్యపరిత్యాగము.

౧౭. ౪ అమనుల్లాగారి ఖాందహారు ప్రయాణము.

౨౧. ౧౧వ ఆంధ్రాయుర్వేద వైద్యసమ్మేళనము - మచిలీపట్టణము.

౨౪. అసెంబ్లీలో లజపతిరాయిగారి స్థానమున రైజాడా హంసరాజుగారి నియామకము.

ఫెబ్రువరి ౬. శ్రీబులుసు సాంబమూర్తిగారి ఎరెస్టు-బెజవాడ.

౧౯. చెన్నపురి పురపాలనసంఘమున సైమను కమిషను స్వాగత సంబంధముగు గందరగోళము.

౧౯. ఢిల్లీయందు గా|| పటేలుగారింట గాంధీగారికివిందు.

మార్చి ౪. విదేశవస్త్రముల దహనసందర్భమున గాంధీగారి ఎరస్టు. జామీనుపై విడుదల-కలకత్తా.

౫. గాంధీగారి రంగూను ప్రయాణము.

౧౯౨౯

౧౬. దేశమునందంతటను విదేశవస్త్రముల దహనసంస్కారము జరుగుట.

౧౯. గోషెన్‌ప్రభువు, ఇర్విన‌గారి స్థానమున నూతన రాజప్రతినిధిగ నియమింపబడుట.

౨౧. బులుసు సాంబమూర్తిగారిని రాజమండ్రినుండి బళ్లారి చెరసాలకు మార్చుట.

౨౬. గాంధీమహాత్మునకు కలకత్తా కేసునందు ౧ రూ. జరిమానా విధించుట.

౨౭. మద్రాసురాష్ట్రీయ వర్ణాశ్రమధర్మసభ - మదరాసు. (3 దినములు)

౩౦. వంగరాష్ట్ర మహాసభ - రంగపూరు. అధ్యక్షులు-సుభాషచంద్రబోసుగారు.

౩౧. ౧౨వ అఖిలభారత హిందూమహాసభ - సూరతు. అధ్యక్షులు-రామానంద ఛటర్జిగారు.

౩౦. ౨౦వ భారత మహమ్మదీయ సమితి సమావేశము-ఢిల్లీ. అధ్యక్షులు-జిన్నాగారు.

౩౦. ౬వ సంయుక్తపరగణాల జాతీయ మితవాద మహాసభ -లక్నో. అధ్యక్షురాలు - అనీబిసెంటమ్మ.

ఏప్రిల్ ౧. కథియావాడు రాజకీయసభ-మోర్వీ. అధ్యక్షులు-వల్లభాయిపటేలుగారు.

౩. భారతదేశీయ తంతుకారక సంఘసభ - సబర్మతీ, అహమ్మదాబాదు.

౮. హైదరాబాదునకు మహాత్ముని రాక.

౮. ఇంగ్లండునుండి ఇండియాకు మొదటిపర్యాయము విమానముపై తపాలు వచ్చుట.

౮. రాజపాల్ ('రంగీలారసూల్' గ్రంథకర్త,)గారి హత్య.

౭. అసెంబ్లీయందు బాంబులుపడుట.

౭. సహకారసంఘ శాసన రజతోత్సవము-చెన్నపురి.

౯. గాంధీమహాత్ముని ఆంధ్రదేశ సంచార ప్రారంభము, బెజవాడకు రాక.

౯. జే. యమ్. సేన్‌గుప్తగారు ౪వ తూరి కలకత్తా పురపాలక సంఘాధ్యక్షులగుట.

# మీ ప్రాణములను

# యూనిక్ భీమా కంపెనీలో

## భీమా చేసుకొనుడు

ఎందువలన ననగా

## భీమావ్యాపారములోనుండు సకలవిధములగు సౌకర్యములను మిక్కిలి చవుకలో మీ కొసంగును

1. శాశ్వత అసమర్థత. (Permanent disability benefits)
2. రద్దయిన పాలసీలు బకాయిపడ్డ ప్రీమియము చెల్లింపకయే తిరిగి పునరుద్ధరింప బడుట.
3. పట్టాలను రద్దుగాకుండ యుంచుట. (Automatic extension)
4. క్రొత్తగా తగ్గించబడిన రేట్లు అన్నికంపెనీలకన్న తక్కువ.

ఇవియే ముఖ్యముగా గమనించవలసిన యూనిక్ వారి సదుపాయములు.

గడచిన పంచవర్షాంతపు మదింపునందు రూ. **1000** ల పట్టా 1-కి రూ. **50** లు లాభము పంచబడెను. రాబోవు మదింపునం దెక్కువ సూచనలు పొడసూపుచుండెను.

యూనిక్ వారి పెట్టుబడిపత్రములు బీదలకు, సామాన్యులకు లాభకరము లయి మిక్కిలి అందుబాటులో నున్నవి.

కాబట్టి యూనిక్ కంపెనీలో పట్టాను తీసుకొనుటలో మీరు లాభమును పొందుటయేగాక మీ వంశమునకు, మీ దేశమునకు లాభమును కలుగజేసినవా రగుదురు.

ఇతర వివరములకు, ఏజెన్సీలకొరకు వీరికి వ్రాసికొనుడు:—

మేనేజింగు ఏజెంట్లు,
10, కానింగు వీధి, కలకత్తా.

ఆర్గనైజర్లు
వాడ్రేవు బ్రదర్సు
పిఠాపురం.

లేక సూపర్నెంటు, ఎ. సి బోస్.
ఆంధ్ర బ్రాంచి, బెజవాడ.